సంపుటము 1] సెప్టెంబరు 1914 [సంచిక 3.

# బాలమిత్ర

బాలికా బాలురకు దేవు – బాగొనర్చి
లలిని చేకూర్చునయ విద్య – లందలిర్చి
మిథ్యఁ బోగార్చి ధీఁ గూర్చి – మిరఁ దనర్చి
త్రచ్చురహి "బాలమిత్ర" చి – త్రంబమర్చి *

## న్యాయపు గంట



అనేక సంవత్సరముల క్రిందట ఒక దేశములో ఒక మంచి రాజుగారు ఉండిరి. ఆయన తన రాజ్యములోని

వారందరు మంచివారై యుండవలెనని కోరెను. భాగ్యవంతులును బీదలును సమానముగా న్యాయమును పొందవలెనని ఆయన ఇష్టము. దీని విషయము ఏమిచేయవలసినదో చాలకాలమువరకు ఆయన ఆలోచించినాడు. చివరకు ఒక్కపని చేయవలెనని తలంచెను. తాను నివసించే పట్టణము మధ్య నడి బజారులో ఒక పెద్దగంటను కట్టించెను. తన రాజ్యములో ఉన్నవారు ఎవరైనను న్యాయము పొందకోరిన యెడల వచ్చి ఆ గంట కొట్టవలసినది. అప్పుడు న్యాయాధిపతియు, పంచాయతివారును వచ్చి, ఆగంట కొట్టిన వారిని విచారించి, సంగతి అంతయు తెలిసికొని తప్పుచేసిన వారిని శిక్షించవలసినది, అని ఒక ఆజ్ఞ కూడ వ్రాయించి, ఆ గంటదగ్గిర పెట్టెను.

ఇటువంటి మంచి యేర్పాటు చేసినందున, అన్యాయము పొందిన వారందరును వచ్చి, న్యాయముపొంది, సంతోషముతో వెళ్ళుచుండిరి. బీదలకు అన్యాయము చేయుటకు భాగ్యవంతులు భయపడిరి. కూలి సరిగా ఇయ్యనియెడల రాజుగారు తెలిసికొని శిక్షింతురేమో నని యజమానులు భయపడిరి. తమపనులు నమ్మకముగా చేయనియెడల న్యాయాధిపతి కనుగొనునేమో అని సేవకులు భయపడిరి. కొన్ని

నెలలలోనే దేశమంతయు బాగుపడెను. దొంగలు లేచి పోయిరి. అబద్ధికులు అడుగంటిరి. చాడీకోరులు తమ అబద్ధములు చాలించిరి. దుర్మార్గులు దూరమైరి. గంటపేరు వింటే చెడ్డవారికి భయముపుట్టెను. మంచివారికి సంతోషము కలిగెను. పట్టణములలోను, పల్లెటూళ్లలోను, దొంగతనములు, మోసములు, పోట్లాటలు మొదలగునవి ఏమియును కనుపడలేదు. కొన్ని సంవత్సరములలో ఆగంట మోగుట క్రమక్రమముగా ఆగిపోయెను. జనులు మంచివారై సుఖముగాను, సంతోషముగాను జీవించుచుండిరి. ఇంక కొంత కాలమునకు ఆ గంటకు కట్టబడిన త్రాడు, ఎండ కెండి, వానకు నాని, చీకి పాడైపోయెను. ఒకనాడు ఒక మనుష్యుడు దానిని చూచి, "త్రాడు పాడైపోయినది. ఎవరికైనా పని కలుగునేమో అని తలంచి నార దొరకక పోయినందున గడ్డిత్రాడుచేసి దానికి కట్టెను. దానిని చూచిన వారందరు నవ్వి ఎగతాళిచేసిరి. ఈలాగు మరికొన్ని దినములు గతించెను.

ఒకనాడు మిట్టమధ్యాహ్నము ఆ ఊరంతయు, డంజ్, డాంజ్ మను గంట శబ్దము విని తొందరపడిరి. అందరును పని నుండి అలసి సొలసి భోజనమునకు ఇండ్లకు వెళ్లి యుండిరి

చాలసంవత్సరముల వరకు వినబడని గంట, "మీ ఊరిలో దుర్మార్గులు ఇంకా ఉన్నారు, వారిని పట్టుకొనండి, పట్టుకొనండి" అని అనుచున్నట్లు అందరు తలంచిరి. ఈ సంగతి ఏమిటో కనుగొనుటకు అందరును, పిల్లలు మొదలు ముసలి వారి వరకు నడి బజారుకు పరుగెత్తిరి. అప్పుడే భోజనము చేసి కొంచెము సేపు నిద్రించవలెనని మంచముపై పండుకొనిన ముసలి న్యాయాధిపతి, దిగ్గున లేచి, కోటు వేసికొని, తల గుడ్డ పెట్టుకొనకుండానే, కుడికాలిచెప్పు ఎడమకాలుకును, ఎడమకాలిచెప్పు కుడికాలుకును వేసికొని, త్వరగా వచ్చెను. పంచాయతివారు కూడ పరుగెత్తుకొని వచ్చిరి.

అక్కడకు రాగానే వెనుకకాళ్లమీద నిలువబడి గడ్డి త్రాటిని నోటితో పట్టుకొని, ఆశతో లాగుచున్న ముసలి బక్కగుఱ్ఱము ఒకటి వారి కంటబడెను. దానిని చూచి అందరును నవ్వనారంభించిరి. న్యాయాధిపతికి చాలకోపము వచ్చెను. గాని ఆ గుఱ్ఱము యొక్క స్థితిని చూచినప్పుడు చాల జాలిపడెను. ఆ గుఱ్ఱము యెవ్వరిదో విచారించి వానిని పిలిపించెను. వాడు చాల భాగ్యవంతుడనియు, చాల పిసినివాడనియు తెలిసికొని వానితో" నీ అంత చెడ్డవాడు ఈ దేశములో లేడు. గుఱ్ఱము ముసలిది అగు వరకు పనిచేయించు

కొని ఇప్పుడు దాని వదలిపెట్టినావా ? అది చచ్చువరకు దినమునకు ఎనిమిది అణాలు దాని మేతకు ఇయ్యవలసినది” అని ఆజ్ఞాపించెను. ఈ సంగతి విన్నవారు అందరు చాల సంతోషించిరి. రాజుగారు. “నా దేశములో నోరులేని జంతువులకు కూడ న్యాయము జరుగవలసినదే” అని చెప్పి న్యాయాధిపతిని మెచ్చుకొనిరి.

అనేక విధములుగా మనకు సహాయము చేయుచు, తమకు కలుగు అన్యాయమును గూర్చి ఇతరులకు చెప్పుకొనుటకు నోరులేని జంతువుల యెడల మనము దయ చూపించవలసియున్నాము.

---

# ప్రకృతి పాఠములు

## 2. అధ్యాయము

### పువ్వుల నిర్మాణము

నీకు మిక్కిలి ప్రియమైన స్నేహితులున్న యెడల వారిని గూర్చిన సంగతులు అన్నియును తెలిసికొన గోరుదువుగదా. అదేలాగున నీవు పువ్వులను ప్రేమించినయెడల వాటిని గూర్చిన సంగతులన్నియు తెలిసికొనుటకు ఇష్టపడుదువు.

ఒక తోటలోకి వెళ్లి అక్కడ వున్న పుష్పాలలో ఒక గులాబి పువ్వును చూడుము. ఆ పువ్వులో ఎన్ని ఎఱ్ఱని పువ్వు రేకులున్నవో గుర్తించుము. అదెంత చిత్రముగా అమర్చబడి యున్నదో చూడుము. అచ్చటికి ఆ పువ్వు యెట్లు వచ్చినది? ఆ గులాబిచెట్టుమీద పెరిగినది అని అందువు. పెరుగుట అనగా ఏమిటి? గులాబిపువ్వు యెట్లు పెరుగునో ఎరుగుదువా? లేని యెడల చెప్పెదను వినుము.

ఆ గులాబిపువ్వు ఒకప్పుడు, ఈ పటమునందు నీవు చూచు మొగ్గవలె నుండెను. అప్పుడు అది ఎంతమాత్రము గులాబిపువ్వువలె ఉండనేలేదు. ఎఱుపు రంగు బొత్తిగా లేని ఒక చిన్న పచ్చటి మొగ్గవలె కనుపడెను. మొగ్గలు పువ్వులుగా మారుటను నీవు చూచియుండనియెడల అది గులాబి పువ్వని ఎన్నడును అనుకొనవు. ఈ గులాబి మొగ్గ క్రమేణ పెద్దదగుచుండును. త్వరలోనే ఈ దిగువ చూపబడినట్లు విప్పుకొని లోపలనున్న ఎఱ్ఱని రేకులు ముడుచుకొని కనుపడును తరువాత కొంతకాలములోనే ఈ రేకులు వికసించి ఇక్కడ కనుపర్చినట్లు మంచి పెద్ద పుష్పమగును. ఇది మొదట మనము చూచిన మొగ్గ





కంటె ఎంతపెద్దదిగా నున్నది! దానికిని దీనికిని ఎంత భేదము ఉన్నది! దానిమధ్య ఎన్నిపుష్పరేకులు ఉన్నవో చూడుము.



ఇక్కడ కనుపర్చిన భేదముకంటె మరి గొప్పభేదము అప్పుడప్పుడు కనుపడును. కొన్ని గులాబిపువ్వులు మనము చూచు పుష్పాలకంటె చాల పెద్దవి.

ఈగులాబిపువ్వు చేయబడినది. పువ్వు పెరిగినదని సాధారణముగా మనము చెప్పుదుము. ఏదో ఒకదానితో ఈపువ్వు చేయబడినది. ఆ మొగ్గ మంచిపువ్వు అగునట్లు, ఏదో కొంత దానిలోకి వచ్చినది. ఆ వచ్చినది ఏమిటి? ఏలాగు వచ్చినది?

గులాబిపువ్వు ఒకవిధమైన రసముతో చేయబడినది. మొగ్గ పెద్దదగుచున్నప్పుడు ఈ రసము దానిలోకి వచ్చి దానిని పువ్వుగా మార్చినది. ఈ రసము ఏలాగు అంత చక్కని పువ్వుగా మారినదో ఎవరును చెప్పజాలరు. దేవునికి తప్ప ఆ సంగతి ఎవరికిని తెలియదు.

మొగ్గలోకి రసము ఏలాగు వచ్చినదని నీవు అడుగవచ్చును గులాబిపువ్వు అడుగున ఉన్న లేతకాడ కనుబడుచున్నదా? ఈ కాడయందు సన్నని గొట్టములు ఉన్నది. వీటి గుండా

ఆ రసము, ఈ మొగ్గ పెరుగుచున్న కాలము అంతయు, ప్రవహించుచునే యుండును. ఈ గొట్టములు చాల ఉన్నవి గనుక చాల సన్నగా నున్నవి. పట్టి కండ్లతో వాటిని చూడజాలవు. అవి ఎంత సన్నగానున్నను వాటి గుండా రసము పారుచుండును.

ఈ రసము ప్రవహించకుండ నిలిచిపోయిన యెడల ఆ మొగ్గ పువ్వు కానేరదు. మొగ్గను తుంచి వేసినయెడల అది ఎన్నటికిని పువ్వుగా ఏర్పడదు, ఎందుకు? ఆ కాడలోని గొట్టముల గుండా రసము పోవుటలేదు.

గులాబి పువ్వులోకి వచ్చిన రసము పువ్వువలెనే ఎఱ్ఱగా నున్నదని అనుకొనవద్దు. అది ఆలాగున లేదు. ఒక కొమ్మను విరచి చూడుము. ఎర్రగా నున్నదా? ఆలాగు లేదు. ఈ రేకుల రుచికిని, రసము రుచికిని భేదము గలదు.

మొగ్గలోకి వచ్చు రసము మొగ్గగా మారుట అంత చిత్రముగా కనుపడదు గాని రసములోనుంచి మంచి రంగుగల పువ్వు రేకులు వచ్చుట మిక్కిలి అద్భుతముగా నున్నది. మొగ్గలను కొన్ని చితుకగొట్టి రసముతీసి, దానితో గులాబి పువ్వును చేయగలవా? లోకములో ఎవరికిని ఆ పని చేతగాదు. దేవుడు ఒక్కడే అట్టి పని చేయగలడు.

# బైబిలు పిల్లలు



కయీను

ప్రియ పిల్లలారా! నేను మీ కీ చిన్న పత్రికయందు బైబిలులోని చిన్న పిల్లల గూర్చి వ్రాయ నిశ్చయపరచుకొన్నాను. ఏల ననగా మీరు చిన్న బిడ్డలుగాన స్వాభావికముగా చిన్న బిడ్డల గురించి వినుటకు మీకు మిగుల ఇష్టమని నా అభిప్రాయము. బైబిలునందు మొదటి బిడ్డలగు కయీను, ఆబేలను బాలుర కథ మీరు ఎరుగుదురు గదా?

వీరు మొదటి కుటుంబములో ఎట్లు పెరిగిరి ? కయీను మొదట నుండి అసూయతగల చిన్నవాడు. తమ్మునికి మేలు చేయక అంత తనకే కావలయునని కోరిన స్వంతమేలు చూచుకొన్న వాడు, ఇతడు తన తల్లిదండ్రులను ప్రేమించి వారిని సంతసపరచినట్లు మనము చదువుట లేదు. కయీను వలె నుండు బాలురుగాని బాలికలుగాని మన మధ్య నున్నారా? అయ్యో! ఉన్న యెడ ఎంత దుఃఖము!

అసూయత స్వంత యిష్టము నే చూచుకొనును. ఇతరులు మంచివా రన్న ఓర్వదు. ఇతరులు బాగుపడుచున్న యెడల ఇక మరీ యోర్వదు. తన యిష్టము నే కోరుట మిగుల అస హ్యించుకొన తగినది. ఇక ఒకని సంతోషము లేనివానిగా చేయునది. నిన్ను నీవు చూచుకొనుటకన్న ముందే దేవుడు నిన్ను చూచుచున్నాడు. నీ కొంటెతనమంతయు చూచుచు నే యున్నాడు.

బైబిలునందు కయీను ఒక బల్లెముగా నుండి తల్లి గుండె నొప్పించినవా డనియు, ఇంటి సంతోషమును పాడు చేసినవా డనియు చెప్పబడి యున్నది. దేవుడు కయీను నిమిత్తము చాల దుఃఖపడెను. వాడు చేసిన తప్పునకై చింతపడు నని ఆయన అనుకొనెను. అయితే, దేవుడు అతనిని "నీ సహో దరుడు ఎక్కడ ?" అని అడిగి నప్పుడు వాడు కోపముతో

"నాకు తెలియదు. నా తమ్మునికి నేను కావలి వాడనా?" అనెను. ఇది అబద్ధము కాదా? దేవుడు కయీను చెడ్డవాడని యెరిగి వాని దేశ దిమ్మరినిగా చేసెను. ప్రియపిల్లలారా అసత్యము పలుకకుడు. ప్రభువు అట్టి బిడ్డలను మెచ్చడు.

సరే గాని దేవుడు ఆబేలు కానుకలను ఏల అంగీకరించెను? ఆబేలునకు వలె నీవును నీకు మిగుల ప్రియమైన వాటిని ప్రభువున కిచ్చుచున్నావా? నీవు నీ పరమ తండ్రిని నిజముగా ప్రేమించిన అట్లు చేయక మానవు.

ప్రియ బిడ్డలారా! మీ యిండ్లలో మీ పెద్దలకు గాని, బళ్లలోను ఉపాధ్యాయులకు, తోటిపిల్లలకు గాని, అందరి కన్న ఎక్కువైన వాడగు మీ పరమ తండ్రికిగాని చింత గలుగ చేయకుడి. మీ నడత మంచిదైన అందరిని సంతోష పరచుదుగు. "ప్రేమ మత్సరపడదు"

---

# బాలమిత్ర టపా

ప్రియమైన బాల మిత్రులారా!

నేను అర్ఫనేజ్ బోర్డింగులో చదువుకొనుచున్నాను. నేను పదునొకండు సంవత్సరములు గలవాడను. నేను ఇప్పుడు 1-వ ఫారంలో నున్నాను. నన్ను మిషన్ వారు




పోషించుచున్నారు. నావలె ఇంకా కొంత మంది పోషింప
బడుచున్నారు. నేను మీ కొక ఉత్తరము వ్రాయ వలెనని
కోరుచున్నాను. నాకు తల్లిగాని, తండ్రిగాని, తమ్ముళ్లుగాని
అన్నలుగాని లేరు. నాకు ఒక అక్క మాత్రము ఉన్నది.
నేను వ్రాయబోవు సంగతులు ఏవనగా, **గుంటూరులో**
చాలామట్టుకు కలరా ఉన్నది గదా. మనము తినుబండా
రములు కొనుక్కొని తినరాదు. మనము జాగ్రతగా
ఉండవలెను. దేవుడు మన యెడల చాల ప్రేమగల**వాడు**
గనుక ఈ కలరా నుండి తప్పించును, గుంటూరులో చాల

బళ్లు పెట్టించి యున్నారు. మనము బాగుగా చదువుకొన వచ్చును. దేవుడు భాగ్యవంతులనేమి బీదలనేమి ఒకటిగానే చూచుచున్నాడు. కాబట్టి మనము ఆయనకు స్తోత్రములు చెల్లింపవలెను మనము ఆయన పిల్లలమై యుండవలయును. యేసు చిన్న పిల్లలను నాయొద్దకు రానియ్యుడి వారిని నిషేదించవద్దని చెప్పెను. గనుక మనము చిన్న హృదయము గలవారమై యున్నప్పుడే మనలను యేసు పిలుచుచున్నాడు. గనుక మనము ఇప్పుడే ఆయన యొద్దకు త్వరపడి వెళ్లవలెను ఈ వాక్యము మన కందరికి ఇష్టమని నేను అనుకొనుచున్నాను.

ఇట్లు మీ ప్రియస్నేహితుడు
కోరుకొండ కృపానందము,

గుంటూరు.

---

# సత్యము చెప్పిన పిల్లవాడు

ఒక ఊరిలో ఒక బడి ఉండెను. ఒక రోజున ఆ బడిలో నున్న ఒక గదిలో కొంతమంది పిల్లలు గుణింతము చెప్పుటకు నిలువబడిరి. ఉపాధ్యాయుడు పుస్తకములో నున్న ఒక పాఠమును తీసి చెప్పుచుండగా చాలా కఠినమైన

మాట ఒకటి యుండెను. ఆయన దానిని మొట్టమొదటి వానిని అడిగెను. కాని వాడు చెప్పలేక పోయెను. తరువాత రెండవ వానిని అడిగెను. ఆ పిల్లవాడు గూడా చెప్పలేకపోయెను. అలాగుననే చివర పిల్లవానివరకు వచ్చేవరకు ఆయన అడిగెను. కాని అడిగినంతవరకు ఒక పిల్లవాడైన సరియైనది చెప్పలేక పోయెను.

అప్పుడు ఆయన చిట్ట చివరనున్న సముయేలు అనే పిల్లవానిని అడిగెను. అతడు అందరికన్న బహు చిన్నవాడు. అతడు చెప్పి, తప్పిన పిల్లలందరి పైకి వెళ్లి మొట్టమొదట ఉన్న పిల్లవాని ప్రక్కను నిలువబడెను. అప్పుడు ఉపాధ్యాయుడు సముయేలు సరిగా చెప్పినాడనుకొని, అతడు చెప్పిన మాటను అందరికి బాగా తెలియు గలందులకు నల్ల బల్లమీద వ్రాసెను.

ఆయన నల్ల బల్లమీద వ్రాసిన తోడనే సముయేలు, “ హా! మీరు వ్రాసిన ప్రకారము నేను చెప్పలేదే!— ‘ష’కు బదులు ‘శ’ అంటిని ” అని, త్వరగా తన స్థలములోకి ఎవ్వరును చెప్పకుండానే వెళ్లెను.

సత్యము అనగా ఇదే. ఆహా! అతడు మర్యాదగల పిల్లవాడు కాడా? తనకు చెందనటువంటి గొప్పతనమును పుచ్చుకొనుటకు ఎంతమాత్రమును ఇష్ట పడలేదు.

సముయేలు రాబోయే దినములలో ఫలించే సత్యమనే విత్తనమును విత్తెను. ఆలాగుననే మనము కూడా ఇకముందు అటువంటి విత్తనములను విత్తుదుము గాక !

---

# ఖైదీ, పుష్పము

ఫ్రాన్సు దేశమందు చార్నీయను ఒకడు ఖైదిగా పట్టుకొనబడెను. అప్పుడు దేశాధిపతిగానున్న నెపోలియన్ వానిని దేశ ద్రోహియని తలంచెను. చార్నీ ఒక నాడు తన గదిముందర షికారు చేయుచుండగా గోడరాళ్ల మధ్యనుంచి పెరిగి బైటకు వచ్చుచున్న మొక్కను ఒకదాని జూచెను. అది యక్కడకు ఏలాగు వచ్చినదో యెవరు ఎరుగరు. బహుశః గాలి కెగిరివచ్చి పడియుండును. అదేమి మొక్కయో అతనికి తెలియుకపోయెను. అయినను ఎందువలననో దాని మీద గొప్ప ప్రేమ పుట్టెను. స్నేహితులకు దూరమయి, చెరసాలలో మూయబడి, చదువుటకును వ్రాయుటకు శక్తి లేక, నిత్యమును చింతయను సముద్రములోనున్న చార్నీకి ప్రాణముతోనున్న ఈ చిన్ని మొక్క ప్రాణస్నేహితుడు అయెను. ప్రతిదినమును ఆవరణములో తిరుగుటకు సెలవైనప్పు

డు తన కాలమంతయు ఈ చిన్ని మొక్కతో గడిపేవాడు. కొంచెము కాలమునకు కొన్ని మొగ్గలు ఆచెట్టుమీద కనుబడెను. అవి విచ్చి పువ్వులైనప్పుడు చార్లీకి కలిగిన సంతోషమునకు మితము లేదాయెను. ఆ పువ్వులు అతి సుందరముగానుండెను. వాటికి మూడు రంగులుండెను. తెలుపు, ఊదా, గులాబి రంగులుగల్గి, అంచుచుట్టును తెల్లటి చారలుండెను. వాటిలో నుండి గుప్పు గుప్పున మంచివాసన పైకి వచ్చుచుండెను. ఇది వరకు కంటె యిప్పుడు వాటిని మరి జాగ్రతతో చార్లీ పరీక్షించెను. ఏ పువ్వులైనను ఇంత చక్కగా అతని కెన్నడును అగపడలేదు.

ఈ మొక్కకు ఎట్టి ఆపదయు గలుగకుండ చార్లీ కాపాడెను. దానిచుట్టు తనకు దొరికిన చెక్క ముక్కలతోను, పాత పేలికలతోను ఒక తడికవంటిదాని చేసెను. ఒకనాడు వడగండ్లవాన కొట్టగా ఆ మొక్కకు దెబ్బ తగులునేమో అని దానిపై వంగి కాపాడెను. దీనివలన అతనికి సంతోషమును ఆదరణయు కలిగెను. ఎన్నో మంచి సంగతులు నేర్చుకొనగల్గెను. అంతకుపూర్వము దేవుడు లేడని అనేవాడు. గాని ఈ మొక్కయొక్క సంగతులన్నియు గుర్తించినపిదప దేవుడు గాక ఇంత చక్కని మొక్కను ఎవరును చేయలేరని తలంచెను.

C. L. S. PRESS, MADRAS—1914